# గ్రంథాలయసర్వస్వము.

సంపు. ౭. | బెజవాడ — అక్టోబరు ౧౯౩౪. | సంచిక ౮.

## అఖిల భారత గ్రంథాలయసభ

ఆరవ అఖిలభారత గ్రంథాలయ ప్రతినిధులమహాసభ డిశంబరునెల ఆఖరువారమున కలకత్తా పట్టణమునందు జరుగును. పలుకుబడిగలిగిన ఆహ్వానసంఘము ఏర్పడినది. డాక్టరు రవీంద్రనాధ ఠాకూరు గారు ఆహ్వాన సంఘాధ్యక్షులుగాను, బిపిన్‌చంద్రపాలు గారు, డాక్టరు కుమారనరేంద్రనాధలా యం. ఏ. బి. ఎల్. గారును ఉపాధ్యక్షులుగాను, పండిత అమూల్యచాద్రవిద్యాభూషణ గారు కార్యదర్శిగాను ఎన్నుకొనబడిరి. ఈసభతోబాటు అఖిలభారత ప్రదర్శనముగూడ జరుగును. ఆంధ్రదేశ గ్రంథాలయసోదరులందరును విచ్చేయప్రార్థితులు.

## రత్న గ్రంథాలయము

భరతఖండమున వంగదేశము సుప్రసిద్ధము. అందు "వీరభూమి"యను సార్థక నామధేయముగల జిల్లా గలదు. ఆజిల్లాయందున్న "సూరి" గ్రామమందు విద్యాభిలాషి యగు "శివరత్న మిత్ర"యను గృహస్థు గలడు.

ముప్పది సంవత్సరముల క్రిందట ఆయన వంగదేశమందలి ప్రాచీన ఆధునిక గ్రంథకర్తలందరియొక్క జీవచరిత్రలను దెలుపు విఘంటువు నొకదానిని వ్రాయవలెనని సంకల్పించెను. అంతకుముం దెవ్వరును ఈమహత్తర కార్యమునకు గడంగియుండలేదు. అందుచేత ఆయన తనపరిశోధనకు గాను గ్రంథములయొక్క అచ్చుప్రతులను, అచ్చుకాని వ్రాతప్రతులను సేకరించుటకు ప్రారంభించెను. పరిశో

ధనకొరకై ప్రారంభించినపని గ్రంథసమీకరణ కార్యమునకు గొని పోయెను; ఈకార్యమునకు అనేక త్రోడ్పాటులు గావలసియున్నవి; అందు ప్రధానమైనది ద్రవ్యము. కాని మిత్రగారికి ఎట్టిత్రోడ్పాటును లేకుండెను. కడుబీదవాడు. అందుచేత గ్రంథసేకరణ కార్యమునకు గాను తాను వస్తుపరుండియైన స్వామ్మును వ్యయ పరుచుచుండెను. ఈకాలమున ఏ అమెరికా కోటీశ్వరుడో లక్షలకొలది ద్రవ్యముతో ఇచ్చామాత్రమున దివ్యతరమగు గ్రంథాలయమును సృష్టించినరీతిగా ఆరోజులలో మనమిత్రగారికి త్రోడ్పడు వా రెవ్వరును లేకపోయిరి.. మిత్రగారియొక్క పట్టుదలకును, గ్రంథముల యందు దాయనకుగల ఆసక్తికిని, ఈగ్రంథాలయమే సాక్షీభూతము.

కొంతవరకు గ్రంథములను సేకరించిన తరువాత, ౧౯౦౧ సంవత్సరమునందీ గ్రంథాలయము మిత్రగారు తన చనిపోయిన సోదరుని జ్ఞాపకార్థము స్థాపించి, దానికి "రత్నగ్రంథాలయ" మని నామకరణము జేసిరి. ఇరువదియైదు సంవత్సరములకంటె యెక్కువ నిరంతర దీక్షవలన ఈగ్రంథాలయమునందు ౨,౦౦౦ అపూర్వములగు అచ్చుపడిన గ్రంథములును, 3,౦౦౦ లకు పైబడి అమూల్యములగు వ్రాత గ్రంథములును గలవు. అచ్చుగ్రంథములందు ఈక్రిందివిషయములను గూర్చిన గ్రంథములు కలవు. ౧ పురాణములు, ఉపనిషత్తులు ౨ వేదాంతశాస్త్రము 3 తత్త్వశాస్త్రము ౪ వాఙ్మయము ౫ కావ్యములు ౬ జీవచరిత్రములు ౭ యాత్రాగ్రంథములు ౮ ఉపన్యాసములు ౯ చరిత్ర, భూగోళము ౧౦ ఆరోగ్యశాస్త్రము, వైద్యము ౧౧ కీర్తనలు ౧౨ విమర్శనలు ౧3 నవలలు ౧౪ పరిశోధనాకథలు ౧౫ నాటకములు ౧౬ ప్రహసనములు ౧౭ పదిశ్రేమలు ౧౮ ఆటలు ౧౯ జ్యోతిషము ౨౦ పనులు ౨౧ నిఘంటువులు ౨౨ యంత్రనిర్మాణకళలు ౨3 వ్యాకరణము.

ఇవిగాక పాతపత్రికా సంపుటములన్నియు గలవు. అచ్చుపడి, ఇప్పుడు ప్రచారములో లేని అపూర్వగ్రంథము లనేకములు గలవు.

ఈ గ్రంథాలయమందున్న వ్రాతగ్రంథములందు వర్గీకరించి గ్రంథముల పట్టిక యందు చేర్పబడినవి ౧,౦౦౦ సంస్కృతగ్రంథము

లును ౨,౦౦౦ బంగాళీభాషా గ్రంథములును గలవు. ఇవిగాక వర్గీక రించి గ్రంథముల పట్టికయందు చేర్పవలసిన గ్రంథము లనేకములు గలవు. పండితులకు ఈగ్రంథాలయ మనేకవిధముల అమూల్యమగు సహకారిగ నుండగలదు. ఈగ్రంథాలయ మందుగల ౨,౦౦౦ వ్రాత ప్రతులయొక్క వివరములను దెలుపు గ్రంథములపట్టికను "వంగీయ సాహిత్య పరిషత్తు"వారు ౧౯౧౯ సంవత్సరమున ప్రకటించినారు. ఈ గ్రంథాలయమందున్న వ్రాత బంగాళీ వచనగ్రంథములనుండి తీసికొన బడిన మాదిరీలతో కలకత్తా విశ్వవిద్యాలయమువా రొకగ్రంథమును ప్రకటించినారు. "ఉజ్వలచందిక" యను పేరుగల అపూర్వ అలంకారిక గ్రంథము (నూటయేబది సంవత్సరములకు పూర్వము వ్రాయబడినది) నొకదానిని "మిత్ర"గారే ప్రకటించినారు.

ఇంకను ప్రకటింపవలసినవి అనంతములుగ గలవు. "మిత్రి"గారి ఆర్థికస్థితి మిగిలిన అపూర్వ గ్రంథములను ప్రకటించుటకు సహకారిగా నుండలేదు. ఇతరులనుండి ద్రవ్యసహాయమును పొందుటకు ఆయన ఎల్లప్పుడును భిడియపడుచుండును. పరిశోధన కార్యములకుగాను విద్వాంసులు గ్రంథాలయమును ఉపయోగపరచుకొనుటయే తనకు గొప్ప బహుమతిగ మిత్రిగారు ఎంచుకొనెదరు.

వంగదేశమందలి ప్రాచీన ఆధునిక గ్రంథకర్తలందరియొక్క జీవచరిత్రల నిఘంటువును వ్రాయుటకు సంకల్పించి, దానికి తోడ్పడు టకుగాను ఈగ్రంథాలయము ప్రథమమందు స్థాపింపబడినదిగదా! ఇప్పు డా నిఘంటు నిర్మాణము దాదాపు పూర్తిగావచ్చినది; ఆరువేల గ్రంథకర్తల జీవితములును వారిగ్రంథముల విమర్శనలును అందు గలవు. ముప్పది సంవత్సరముల నిరంతర పరిశ్రమవలన తయారైన ఈ అపూర్వగ్రంథము త్వరలోనే ప్రకటింప బడగలదు.

---

## స్థానిక సంస్థలు

ప్రజాసామాన్యముయొక్క జ్ఞానాభివృద్ధికొరకు చేయవలసిన కృషి.

మనదేశమునందు నూటికి తొమ్మండుగురు మాత్రము చదువు కొన్న వారు. తక్కిన వారందరు నిరక్షరకుక్షులు. ఈ స్వల్పసంఖ్య

గల చదువుకొన్న వారిలో కూడ బహు తక్కువమంది మాత్రమే తమకుగాని తమ తోడివారికి గాని ప్రయోజన మియ్య తగినంత విద్య నభ్యసించినవారు. మిగిలిన వారందరును అతి కష్టముమీద వర్ణక్రమము చెప్పకొని అచ్చుప్రతినుండి అక్షరములు పెగల తీయువారును సంతకము మాత్రము చేయగల వారును, అయి యున్నారు.

ఇట్లు మన దేశ ప్రజాసామాన్యము నావహించియున్న అజ్ఞానాంధకారమును దొలగించి జ్ఞానజ్యోతిని మన దేశస్థులందరి మనములందు ప్రజ్వలింప చేయుటకు అచ్చటచ్చట కొలది ప్రయత్నములు ప్రారంభ మగుచున్నవి. ఈ విధమున ఫలసిద్ధినొందుటకు యెంత కాలము పట్టునో దురూహ్యము.

ఈవిషయ మిట్లుండగా విద్యాలయముల మూలమున అల్ప విద్యను మాత్రము సంపాదించినవారు దానిని మరువు చెంది అజ్ఞానమునందు తిరిగి పడకుండ నాపుటకును- తమంతట తాము జ్ఞానాభివృద్ధి చేసికొనుటకు తగినంత విద్యను కోమలవయస్సునందే యభ్యసించినవారు తమ విద్యను అవసరమగునట్లు అభివృద్ధి నొందించుకొనుటకును- కావలసిన సంస్థలు మన దేశమున లేనేలేవని చెప్పిన సత్యమునకు దూరముగా నుండదు. ఇక నిరక్షరకుక్షుల జ్ఞానాభివృద్ధికొరకు కృషిచేయు సాధనములు లేనేలేవని వేరుగ చెప్పనక్కర లేదు.

ఈలోపము లన్నిటిని నివారణచేయు భారము ముఖ్యముగా మన స్థానిక సంస్థలపై నున్నది.

మనకిప్పుడు సిద్ధించవలసిన ఫలమేమనగా చక్షురక్షర సంయోగమువలన జ్ఞానాభివృద్ధి చేసికొనలేనివారికి జ్ఞానాభివృద్ధి చేయగల మార్గముల నన్వేషించి వానిని అవలంబించవలెను. తమంతట తాము చదువుకొనగల్గియు తమ కవసరమగు విషయముల నన్నిటిని అర్థము చేసికొనలేనివారికి అట్టి సహాయమును కల్గచేయువలెను. చదువుకొనగల్గియు చదివినదానిని అర్థము చేసికొనగల్గియు నున్నవారికి అందుబాటులోనుండునట్లు పుస్తకసమూహములను చేర్చవలెను. ఈపనులను మన స్థానికసంస్థ లెట్లు నిర్వర్తించవలెనో విచారించి చూతము.

చదువురానివారికి జ్ఞానోదయము చేసి అభివృద్ధి నొందించుటకు మార్గము లెన్నియో గలవు. సంచారోపన్యాసకులను నియమించి వారి మూలమున పల్లెటూళ్లలోను, బస్తీలలోను మ్యాజికులాంతరు మొదలగు యంత్రసహాయముతో- ఆయాచోట్ల నివసించు ప్రజల యొక్క స్థితిగతులనుబట్టియు వారి కుండు జ్ఞానసంపత్తును బట్టియు అవ సరమగు భేదముల నవలంబించి, ప్రజాసామాన్యమునందు విద్యాభివృద్ధి చేయవచ్చును. బొమ్మలుగల పటములు కార్డులు మొదలగు పరికర ముల మూలమునకూడ ఈ ఫలమును పొందవచ్చును. హరికథా రూప మున పాటలు పద్యములు మొదలగు జనరంజకమగు సాధనముల నవ లంబించి కేవల మతసంబంధ మైనట్టియు నీతిసంబంధ మగునట్టియు విషయములను గూర్చియేగాక జనసామాన్యమునకు ముఖ్యముగా కావలసిన ఆరోగ్యము, చరిత్ర, భూగోళము, శరీరశాస్త్రము, వ్యవ సాయశాస్త్రము, ప్రకృతిశాస్త్రము మొదలగు విషయములనుగూర్చి ప్రజలకు బోధించవచ్చును. ఇంక పురాణపఠనపద్ధతి నవలంబించి కూడ ప్రజా సామాన్యమునకు విద్యాభివృద్ధి చేయవచ్చును.

తమకు కావలసిన విషయములను చదువుకొనగల్గియు చదివిన దానిని అర్థము చేసికొనలేనివారి యుపయోగముకొరకు, తాత్కా లిక పాఠశాలలను స్థాపించవచ్చును. ఈ విషయము విపులముగా రాబోవు సంచికయందు వివరింపబడును.

పుస్తకములను అపేక్షించువారికొరకు స్థాయి గ్రంథాలయ ములను, సంచార గ్రంథాలయములను స్థాపించవలసియున్నది.

ఈ యన్ని సంస్థలకు ముఖ్యసాధనము ద్రవ్యము. రెండవది వీనిని నడుపుటకు తగిన కార్యనిర్వాహకులు.

మొట్టమొదట తాలూకా బోర్డులును, జిల్లాబోర్డులును మన కీ విషయమున ఎట్లుపకరించునో నిర్ణయించెదము.

మనకిప్పుడు ప్రతి తాలూకాకును ఒక్కొక స్కూళ్ళ డిప్యూటీ ఇన్‌స్పెక్టరు ఉద్యోగి యున్నాడు. ఈ అధికారికి మ్యాజికులాంతరును సప్లయి చేయవలెను. ఈయన తనక్రింద ఉండు పాఠశాలోపాధ్యా యుల యుపయోగము కొరకు అచ్చటచ్చట కూడలి స్థలములందు

సెంట్రల్ క్లాసులు" అను పేర సమావేశములను ఏర్పర్చుచుండును. అచ్చటకు ఆ ప్రాంతపు యుపాధ్యాయు లందరు చేరుదురు. ఈ సమావేశముల సందర్భమున, ఇదివరకు నియమింపబడియున్న మామూలు పని పూర్తి అయిన పిదప చుట్టుపట్ల నివసించు ప్రజలనందరను విశ్రాంతి ప్రదేశమున సభగా కూడునట్లు చేయవలెను. సెంట్రలు క్లాసుకు వచ్చిన ఉపాధ్యాయులలో కొందరు వాచాలురుగాను కొంతవరకు విద్యావంతులుగానుండును; గాన వారలవలన సర్వజనులకు ఉపకరించు విషయములను గూర్చి సులభశైలిని ఉపన్యసించునట్లు చేయవలెను. డిప్యూటీ ఇన్‌స్పెక్టరు ఈ సమావేశములను నిజముగా ప్రజలకు ఉపయోగకారిగా నుండునట్లు చేయవలెను. స్వయముగా ఆయనయే ఒకప్పుడు ఉపన్యసింపవచ్చును. ఇతరులను తయారుచేయవచ్చును. ఈ యుపన్యాసములకుతోడు సులభశైలిని వ్రాయబడ్డ కరపత్రములను ప్రకటించవచ్చును.

మరియు ఈ సెంట్రలు క్లాసులమూలమున సంచార గ్రంథాలయ పేటికలను గ్రామములందు వ్యాపింప చేయవచ్చును. అది ఎట్లో కొంతవరకు ఇచ్చట వివరించెదను.

ప్రతి తాలూకాబోర్డువారును ప్రతి సంవత్సరమును తమక్రింద యున్న పాఠశాలల యుపయోగము కొరకు కొన్నివందల రూపాయిలు విలువగల గ్రంథములను కొనుచుందురు. ఇట్లు కొను గ్రంథముల లిష్టును ముందుగా ఇందుకొరకు ఏర్పడు ప్రత్యేక కమిటీద్వారా నిర్ణయించవచ్చును. దీనికితోడు ప్రతి సంవత్సరము అదనముగా సంచార గ్రంథాలయ పేటికల కొరకు మరికొంత ద్రవ్యమును వెచ్చింపవలయును. ఈ సొమ్ముతో అచ్చటచ్చటి ప్రజల యొక్క అవసరములను బట్టియు, వారి కుండు జ్ఞానసంపత్తును బట్టియు కావలసిన గ్రంథములను తెప్పించవచ్చును.

సంచార గ్రంథాలయ పేటిక యనగా నేమో ఇచ్చట చెప్పుట యవసరము. ఈ పెట్టెలు టేకుతోగాని దేవదారు చెక్కలతోగాని చేయవచ్చును. ఈ పెట్టె చులకనగా ఒక మనుష్యుడు తీసికొని పోవుటకు తగినంత తేలికగాను, చిన్నదిగాను యుండవలెను. ఇది రమారమి

ఒక అడుగు వెడల్పుగలది గాను రెండడుగులు పొడుగుగాను యుండు ను. ఇది ఒక అరవలె నుండును. ముందు భాగమందు రెక్కల తలుపులు అమర్చబడియుండును. ఈపెట్టె లోపలిభాగము రెండుగా విభజించ బడి యుండును, పైభాగము రమారమి ఒక అంగుళము వెడల్పుగాను మిగిలిన దంతయు రెండవభాగముగాను యుండి ఈరెండుభాగముల మ ధ్యను ఒక బల్ల అమర్చబడి యుండును. ఈపెట్టెకు రెండువైపులను పట్టుకొనుటకును, తాడు కట్టుటకును వీలుగా నుండునట్లు గొళ్ళెములు వేయబడియుండును. పెట్టెయొక్క పైఅర యందు కాగితములు రిజ ష్టర్లు పెట్టుకొనుటకును అడుగు భాగమంతయు పుస్తకములు పెట్టు టకును ఉపయోగపడును. రెండు వైపుల నుండు గొళ్ళెములకు తాడు కట్టి కట్టుకు తగిలించి బుజమున పెట్టుకొని చులకనగా ఈ గ్రం థాలయ పేటికను తీసికొని పోవచ్చును.

ఇట్టి పేటిక నొకదానిని టేకు చెక్కలతో చేయుటకు రు 10ల ఖరీదుకు మించదు. ఇం దుంచ వలసిన గ్రంథముల ఖరీదు రు 40 లు గా మదింపుచేయవచ్చును. సంవత్సరమునకు రు 500 లు ఈమూాల మున వ్యయపెట్టుటకు తాలూకాబోర్డువా రంగీకరించినచో ఇందుతో 10 పెట్టెలను సంగ్రహించవచ్చును. సంవత్సరములుగడచిన కొలది ఈపేటికల సంఖ్య హెచ్చగును. ఈపెట్టెలను తాలూకా బోర్డు కచేరీ లో నుంచవచ్చును. ఇచ్చటనుండి ఈపెట్టెలను కొన్నిటిని ఒక సెంట్రిలు క్లాసుకును మరికొన్నిటిని మరియొక సెంట్రిలు క్లాసుకును చేర్చి అచ్చటనుండి ఉపాధ్యాయుల ద్వారా గ్రామములలో వ్యా పింప చేయవచ్చును.

పైన చెప్పిన అన్నిపనులను తాలూకాబోర్డులును జిల్లాబోర్డు లును మ్యూన్సిపాల్టీలును వెంటనే ప్రారంభింపవచ్చును. ఇందుకొరకు వెచ్చించ వలసిన ద్రవ్యము అంతగా నుండదు. నూతనముగా నియ మించ వలసిన సిబ్బందీయును ఉండ నక్కరలేదనియే చెప్పవచ్చును.

స్కూళ్ళ డిప్యూటీ ఇనిస్పెక్టరు జీతమును గవర్నమెంటు వారే యిచ్చుచుందురుగదా. మ్యాజిక్కు లాంతరును మాత్రము తాలూకా బోర్డువారు కొని యివ్వవలెను. ఇదిగాక ఒక్కొక్క తాలూకాబోర్డు

వారు ఒక సంచారోపన్యాసకుని నియమించి గ్రామముల వెంట పంప వచ్చును. వీరిని తరిబీతు చేయుట కొంత ప్రయత్న పూర్వకముగా జరుగవలసిన పనియేగాని దుర్ఘటమైనది కాదు. ఇప్పుడు "హెల్తుఇన్ స్పెక్టర్ల"ను తరిబీతు చేసినట్లే వీరినిగూడ తరిబీతు చేయవచ్చును. ఉపాధ్యాయులు తాలూకాబోర్డువారివలన జీతము తీసికొనువారు. పైన చెప్పిన ప్రకారము వారు నూతనముగా నిర్వర్తించవలసిన పనులు బహు స్వల్పమైనవిన్ని ఎప్పుడో యొకప్పుడు చేయవలసినవిన్ని అయియున్నవి. ఇందు కొరకు అధికముగా యివ్వవలసిన జీత ముండదు. తాలూకాబోర్డు ఆఫీసుద్వారా జరుగవలసిన పనులకు క్రొత్తసిబ్బందిని నియమించ వలసిన పనిలేదు. మ్యూన్సిపాల్టీలలో స్కూళ్ళ సూపర్వయిజరు ఉండును. ఈ యుద్యోగివలన పైన చెప్పిన పనులన్నియు ఉపాధ్యాయుల సహాకారముతో నిర్వహించవచ్చును.

ప్రజల అజ్ఞానమువలనను దురాచారముల వలనను దురలవాటులవల్లను పొందుచున్న విపత్తులు మిక్కిలిగా నున్నవి. కనుక తన్నివారణ కొరకు స్థానిక సంస్థలు తగినట్లు కృషిచేయుట అనసరమును ఆవశ్యకమును అయియున్నది.

—సూరి వేంకట నరసింహ శాస్త్రి.

# పట్టణ గ్రంథాలయ కథనము

అనగనగా అమెరికాదేశమను పేరుగల భూభాగము గలదు. ఆదేశంలో "ఇండియా నెపోలిస్" అను పట్టణం గలదు. ఆపట్టణమున అరవై సంవత్సరములక్రిందట ఒక గ్రంథాలయము స్థాపింపబడినది. మొదట ౧౧౩ గురు సభ్యులు అందుచేరి చందాలపద్ధతిని దానిని నడపిరి. ఇట్లు నాలుగుసంవత్సరములు గడచునప్పటికి అది పౌరధర్మ గ్రంథాలయముగ మార్చబడెను. ఈమార్పు జరుగునప్పటికి అందు ౩,౬౮౭ గ్రంథము లుండెను. మరి ౮,౦౦౦ గ్రంథములను పండితుల సలహా ననుసరించి సేకరింపబడెను.

౧౮౭౨ వ సంవత్సరమునం దీగ్రంథాలయమునకు "చార్లెస్ ఈవాన్సు" అను సుప్రసిద్ధుడు గ్రంథభాండాగారిగా నియమింపబడెను. అప్పటినుండియు ఈగ్రంథాలయము విశేషమైన అభివృద్ధిని పొందసాగెను. ఆయన పరిపాలనా కాలమునందే ఈగ్రంథాలయమునకు నూతనభవన నిర్మాణము జరిగెను; ఈభవనమునందు ఇరువది సంవత్సరము లున్నపిమ్మట అది చాలకపోవుటచే మరియొక గొప్పభవనము నిర్మింపబడెను.

౧౮౯౨ వ సంవత్సరము నం దీగ్రంథాలయమునకు అదివరకే ఆగ్రంథాలయమందు సేవకురాలుగా నున్న "ఎలీజాగోర్డనుబ్రౌనింగు" అను నారీమణి "గ్రంథభాండాగారి" గా నియమితురాలై తన అసమానమైన సామర్థ్యమువలన గ్రంథాలయమును మహోన్నతమైన స్థితికి దేగలిగెను. ఈ ప్రకార మామె ౨౫ సంవత్సరముల కాలము "గ్రంథభాండాగారి" పదవి నలంకరించి ౧౯౧౭ సంవత్సరమునందు ఆ పదవిని వదలి విశ్రాంతిని దీసికొనెను. ఈమె పరిపాలనకాలమునందు గ్రంథములు ౫౦,౦౬౦ ల నుండి ౨,౧౨,౦౦౦ లకు అభివృద్ధియాయెను. గ్రంథములను అక్కడ చదువువారు ౧౬,౦౮౭ నుండి ౮౧,౮౫౩ నకు హెచ్చెను. ఇండ్లకు తీసికొనిపోవు గ్రంథముల సంఖ్య ౧,౮౨,౯౫౩ నుండి ౭,౨౫,౭౯౧ యయ్యెను. పండ్రెండు శాఖా గ్రంథాలయములు స్థాపింపబడెను. బాలశాఖ, పాఠశాలలకు రిఫరెన్సుశాఖ, ఏర్పరుపబడెను. తలుపులులేని బీరువాలయందు గ్రంథములనుంచు పద్ధతి అవలంబింపబడెను. మాసపత్రిక యొకటి ప్రారంభింపబడి నిర్విఘ్నముగ కొనసాగింపబడెను.

ఈ గ్రంథాలయమునందు ఇరువదియైదు సంవత్సరములకాలము పనిచేసి జగద్విఖ్యాతి నొందిన "ఎలీజాగోర్డనుబ్రౌనింగు" దొరసాని కడచిన మే నెలయందే స్వర్గమలంకరించెను. ఆ గ్రంథాలయము యొక్క దివ్యభవనమే ఆమెకు జ్ఞాపక చిహ్నముగ నుండగలదు.

ఐరోపా మహాయుద్ధమందలి భటులు చదువుకొనుటకై ఈ గ్రంథాలయమువారు అనేక గ్రంథములను సేకరించి పంపియుండిరి. ౧౯౧౮ సంవత్సరమునందు ఈ గ్రంథాలయము నందలి గ్రంథము

లన్నిటిని నవీన పద్ధతుల ననుసరించి, వర్గీకరణము చేయబడెను. ఈ వత్సరమునుండియు ఈగ్రంథాలయమును అనేకవిధముల అభివృద్ధిజేసి యుండిరి. ప్రత్యేక విషయములను గూర్చి పరిశీలన చేయవలచువా రికి ప్రత్యేక సదుపాయములు, ఉపాధ్యాయులకు వారి వృత్తికి సం బంధించిన ప్రత్యేక గ్రంథములు, బాలురవిద్యావిధానములు, తరి బీతు తరగతులు - ఈరీతిగా నూతన శాఖలు అనేకముగా ఏర్పడుపబడె ను. గ్రంథాలయముయొక్క ఉపయోగము పొందని పట్టణభాగములు రెండింటియందు శాఖలు ఏర్పరుపబడెను. ఒక ఉన్నతపాఠశాల యొక్క గ్రంథాగారమును ఈగ్రంథాలయముయొక్క శాఖగా అం గీకరించి, దానిని పునరుద్ధరించిరి. పట్టణమునందు నీగ్రోలు నివసిం చు భాగములందు రెండుశాఖలు ఏర్పాటు గావింపబడెను. పాఠశాల లందు ఉపాధ్యాయులకు ఆయాతరగతుల గదులయందలి గ్రంథాగా రములకు కావలసిన గ్రంథములను, ఉపాధ్యాయుల తరిబీతు పాఠశా లలకు కావలసిన గ్రంథములను సప్లయి చేయుటకు ఏర్పాటులు జరి గెను. ౧౯౨౧ సంవత్సరమున, పట్టణమందలి పరిశ్రమాభివృద్ధికి కావ లసిన గ్రంథములను చదువరులకు అందజేయుటకు ఒకశాఖను, వైె ద్యశాలలందలి రోగులకు గ్రంథముల నందజేయుట కొక శాఖను ఏర్పరచిరి. ౧౯౨౮ సంవత్సరమున లలిత కళలకును, సంగీతమునకును సంబంధించినట్టి శాఖ నొకదానిని నెలకొల్పిరి; ఇంతేగాక పాఠశాలలను విడిచిన బాలురకును బాలికలకును ప్రత్యేక సౌకర్యములను కలుగ జేయుట కొకశాఖను ఏర్పరచిరి.

గ్రంథాలయముల మూలమున ఎన్నివిధముల ప్రజల కుప యోగించుటకు సావకాశములు గలవో జనసామాన్యమునకు బోధించు టకుగాను, ఈగ్రంథాలయమువారు ఎల్లప్పుడును క్రొత్తకార్యక్రమమును అవలంబించుచు, గ్రంథాలయోపయోగమును సదా పెంపొందింప జే యుచుండెదరు.

ఈ గ్రంథాలయమునకు ప్రచురణశాఖ యొకటికలదు. ఈశా ఖవారు వారిశాఖా గ్రంథాలయముల మూలమునేగాక, దినపత్రికల మూలమున, వారపత్రికల మూలమున, కరపత్రికల మూలమును,

ప్రసంగముల మూలమున, ప్రదర్శనముల మూలమున, ఉత్తరముల మూలమున- ఇంకను అనేకవిధముల తమ గ్రంథాలయమును గూర్చి ప్రకటించుకొనుచుండెదరు. ఇవిచాలక, గ్రంథాలయ పక్షమున ప్రచారమునకుగాను మాసపత్రిక నొకదానిని ప్రకటించుచున్నారు. పట్టణమునందలి జనులెల్లరు ఈగ్రంథాలయమునుగూర్చి తెలిసికొని దాని ఉపయోగమును పొందవలెనని వారి యాశయము.

బాలశాఖనుగూడ అనేకవిధముల పెంచినారు; ఈశాఖయందలి గ్రంథములను విశేష పరిశ్రమజేసి, ఏర్చిపెట్టినారు. "మంచి గ్రంథముల ప్రదర్శనము"ను సంవత్సరమున కొకసారి ఏర్పరచెదరు. వేసవి కాలపు సెలవుదినములలో ఎక్కువ గ్రంథములను చదివిన పిల్లలకు బహుమతుల నేర్పరచెదరు. ఇందువలన పిల్లలలో నూటికి ౯౯టికి తక్కువ గాకుండ ఈగ్రంథాలయోపయోగమును పొందెదరు.

ఇన్నివిధముల అభివృద్ధిపొందుట వల్ల ఈ గ్రంథాలయ ఉపయోగము అమితముగ హెచ్చి పోయెను. ౧౯౧౭ సంవత్సరమున జూను నెలతో అంత్యమయ్యే కాలమునకు ఇండ్లకు గ్రంథములను తీసికొని పోవువారి సంఖ్య ౭,౨౫,౭౯౧ అయియుండగా, ౧౯౨౭ సంవత్సరము జూను నెలతో అంత్యమగు కాలమునకు ఇండ్లకు తీసికొనిపోవు గ్రంథముల సంఖ్య ౨౦,౯౫,౫౮౧ అయ్యెను. గ్రంథములను ఇండ్లకు తీసికొని పోవువారి సంఖ్య నూటికి ౧౬౧ చొప్పున పెరిగెను. పట్టణము యొక్క జనాభా నూటికి ౨౨ చొప్పున పెరిగెను. గ్రంథాలయము నుండి గ్రంథములను చదువువారి సంఖ్యమాత్రము నూటికి ౧౩ నుండి ౨౯ టికి పెరిగెను. శాఖాగ్రంథాలయము లందలి అంకెలు నాలుగు రెట్లు అయ్యెను. చిన్నపిల్లలయందు చదువువారి సంఖ్య ౧౦౦ కి ౨౭౫ చొప్పున పెరిగెను. చిన్నపిల్లలు చదువు గ్రంథముల సంఖ్య నూటికి ౧౮౫ చొప్పున బెరిగెను.

పది సంవత్సరముల కాలములో ఇట్టి అపరూపమైన అభివృద్ధి కలుగుట సామాన్య కార్యము గాదు. గ్రంథాలయ ఉపయోగము ఇట్లు అమితముగ హెచ్చి పోవుచుండ, గ్రంథాలయ పరిపాలకులగు అధికారులు అప్పుడప్పుడు గ్రంథాలయమునకై, పట్టణమునందు వేయు

పన్నును తగ్గించి గ్రంథాలయము యొక్క ఆదాయముగూడ తగ్గించుట తరుచుగా తటస్థమగుచుండును. అట్టి స్థితిగతులయందు "గ్రంథభాండాగారి" యొక్క నిరంతర కార్యదీక్షయును, మొండి పట్టుదలయును సహజానందమును మాత్రమే గ్రంథాలయ జయప్రదమునకు దోహదపడుచుండును.



## గంజాంమండలము - గ్రంథాలయోద్యమము

గంజాంజిల్లా నరసన్నపేట యందుగల శ్రీనాగేశ్వర రాయ గ్రంథాలయమువారు, గంజాంమండల గ్రంథాలయసంఘ అధ్యక్షులగు శ్రీ కోకా అప్పారావు నాయుడుగారికి సన్మానపత్రము సమర్పించిరి. దానికి జవాబు చెప్పుచు వారు గ్రంథాలయాభివృద్ధికరము లగు అనేక హితోపదేశములను చేసిరి. తాము మండల దేవాలయ సంఘాధ్యక్షులుగా నుండునంతకాలము పూర్వపురీతిని గ్రంథ భాండాగారములను దేవాలయములలో ప్రతిష్ఠాపన చేయుటకు ప్రోత్సహించెదననియును, గ్రామ పునర్నిర్మాణమునకు ముఖ్యాంగములు మూడనియు నందులో మొదటిది గ్రామపంచాయితీసంఘ మనియు రెండవది పరపతిసంఘమనియు మూడవది గ్రంథాలయమనియు, గ్రంథాలయము గ్రామములోని అందరు ప్రజలకును కూడలిస్థానముగ నుండవలెననియు, పుస్తకములు వార్తాపత్రికలతో బాటుగా గ్రామస్థుల కుపయోగించు అనేకవిషయములను గ్రంథాలయములో జాగ్రత్తచేసి యుంచవలెననియు, వార్తాపత్రికలు చదువురానివారికి చదివి వినిపించవలెననియు, అట్లుచేసిననేగాని గ్రామస్థుల సాంఘిక రాజకీయ విజ్ఞానములకు గ్రంథాలయములు సహాయకారులు కావనియు జెప్పిరి.

పొట్నూరు స్వామిబాబుగారు సుమారు పదునారు సంవత్సరములనుండియు తమ నిరంతరకృషిచే నరసన్నపేట గ్రంథాలయమును అభివృద్ధికి దీసికొనివచ్చుటయేగాక మండల గ్రంథాలయోద్యమమునకుగూడ విశేషకృషిని జేసినారు. వారు గ్రంథాలయమునకు

భవనమును కట్టించియిచ్చుటకు వాగ్దానము చేసినారని వినుటకు మిక్కిలి సంతసించుచున్నారము.



## బ్రిటిషు గ్రంథాలయ మహాసభ

కడచిన సెప్టెంబరు నెలయందు ౫౧ టవ బ్రిటిషుదేశ గ్రంథాలయ మహాసభ జరిగినది. ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ ప్రచారకులలో నొకరగు దాసు త్రివిక్రమరావుగారు ప్రత్యేక ఆహ్వానము మీద ఈసభకు బోయియుండిరి; ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ తత్వ్వమును గూర్చియు, బరోడా రాజ్యమందలి గ్రంథాలయ పరిపాలనను గూర్చియు విపులముగ జెప్పిరి. భారత వర్షమునందు గ్రంథాలయోద్యమమునకు విశేషసహాయము లేదనియు, "గ్రంథాలయ కామన్వెల్తు సంఘము" వారు ఆయా దేశములందలి ప్రభుత్వముల వారు ధర్మగ్రంథాలయోద్యమమునకు తోడ్పడు శాసనములను చేయుటకు ప్రయత్నించుట ధర్మమనియు చెప్పిరి.



## గ్రంథాలయమునకు గొప్పవిరాళము.

అమెరికా దేశమందలి కోటీశ్వరుడగు "రాక్‌ఫెల్లరు" గారు విద్యాసంస్థలకు సహాయముచేయుటకుగాను ఒక ధర్మసంస్థాపనను స్థాపించినారు. ఆసంస్థాపనవారు ఇంగ్లాండు దేశమందలి "కేంబ్రిడ్జి" విశ్వవిద్యాలయమునకు రు 105,00,000 లను దానమిచ్చినారు. ఈ దానములో రు 37,50,000 లను ఆ విశ్వవిద్యాలయ గ్రంథాలయమునకు ప్రత్యేకించినారు. ఈనూతన గ్రంథాలయభవన నిర్మాణమును వెంటనే ప్రారంభించెదరు.





విశ్వ విద్యాలయమువారు ఈనిరాశిమునకు రు 34,35,000 లను చేర్చి ఖర్చుపెట్టవలెనను షరతు కలదు.

## ఆంధ్రోద్యమము.

అనంతపురమందు జరిగిన ఆంధ్ర మహాజనసభ అధ్యక్షులగు

శ్రీ ఓ. లక్ష్మణస్వామిరావుగారు

తమ ఉపన్యాసమునందు ఇట్లు నుడివియున్నారు.

ఆంధ్రదేశంలో జరుగవలసినపనిచాలా ఉంది. పూర్వంఆంధ్రోద్యమం మూలకంగానే గ్రంథాలయోద్యమం విరివిగా పెరిగింది. అదేమి కారణమోకాని బెజవాడలోని రామమోహన గ్రంథాలయం, హైదరాబాదులోని మ్యునిసిపలు గ్రంథాలయం, ఇట్లాటి పెద్దతెగలో చేరకపోయినా కర్నూలులోని ఆంధ్రగ్రంథాలయం, నంద్యాలలోని విక్టోరియా రీడింగురూమ్—ఇట్లాటి పట్నవాసపు గ్రంథాలయాలే నేటిదినం ఆనాటిగ్రంథాలయోద్యమానికి గుర్తులుగా నిలుచబడియున్నవి. ఆంధ్ర సర్వకళాశాలయేర్పడిందానికి అందులోని విద్యావ్యాప్తి (Extension) పనిజరిపి ప్రజావికాసంవిస్తారంగా జరిపించే సంస్థలు దేశమంతటాయేర్పడవలసియున్నవి. గ్రంథాలయ సంఘాలుంటే యీ పనికి దోహదం బాగా జరుగుతుంది. అందువల్ల ఆంధ్రోద్యమ పటుత్వం బాగా నెలకొనడానికి మార్గమవుతుంది. ఆంధ్రస్థాయి సంఘంవారు యీపని గట్టిగా ఆరంభించవలెను.

1913 సంవత్సరములో ఆంధ్రస్థాయి సంఘంవారి తరఫున ప్రకటితమైన ఆంధ్రోద్యమమనే కరపత్రంలో ఆంధ్రోద్యమంయొక్క ఉద్దేశాలు చెప్తూ దేశంలోని వ్యాపార వ్యవసాయ పరిస్థితులు కనుగొని ప్రజలలో పరస్పర సహకార విశ్వాసములను బుట్టించడమున్నూ, ప్రజల ఆ

రోగ్యము దేహబలములకు సంబంధించిన విజ్ఞానం వ్యాపింప జేసి బలవంతులు తేజోవంతులు దేశంలో ప్రబలేడు పాయాలాలోచించడం పయి ఉద్దేశాల్లో చేరినట్లు వ్రాసినారు. ఈ ఉద్దేశాల నిర్వాహణం కూడా కొంత కొంతైనా జరిగినట్లు కనిపించడం లేదు. తాలింఖానాలు, గరిడీఖానాలు, దసరా పోటీపందెములు, విద్యార్థుల వ్యాయామసంఘాలు, ఆరోగ్యవిజ్ఞాన ప్రచారక మండలులు, వైద్యసహాయ సమితులు, ఊరూర ప్రోత్స హించుటకు మన దేశమునందెంతైనను అవకాశమున్నది. కాని యీపని అంతయు స్కూళ్ళ ఇన్స్పెక్టర్లది, శ్యానిటరీ ఇన్స్పెక్టర్లది, మాత్ర మేయని నాయకు లుదాసీనభావము పొందియున్నారు. ఆంధ్రుల ప్రత్యేక శక్తులు విజృంభింప వలెనంటే ఈ అన్ని విధముల జీవితము నకు ప్రోత్సాహము కలుగవలెను.

అన్ని కార్యాలకు ఉద్దీపనం హృదయాన్ని పొంగజేసే శబ్దం. అది జాతీయమైనటువంటి కథల్లో, పాటల్లో, సుద్దుల్లో యిమిడి యున్నది. దాన్ని బహిరంగపరచే సాధనాలు కూడా ఆంధ్రోద్యమ కారకులు ఆలోచించవలసిందని శాసించినారు. అయితే సాధారణం గా వినిపిస్తూండిన బొబ్బిలిపాట శబ్దమే క్రమక్రమంగా కరువౌతూవుంది. అనుదినం చదువుతూవుండిన భారత భాగవతాల సుస్వనము సాధార ణంగా వినరావడంలేదు. ఇండ్లలో ఆడవాండ్లు పాడుకొనుచుండిన సా విత్రి-సీత మొదలైన మహావ్యక్తుల గానము నశించిపోయి యుండవ చ్చును. ఈ యన్నిటిని పునరుద్ధరించడం, నవీనజ్ఞానము నెడల ఉత్సాహ ము వ్యాపింపజేయుడం, ఇవియన్నిన్నీ స్థాయిసంఘమువారు తల పెట్ట వలసిన విషయములే.

## సమాచారములు

విజయనగరమున ఆంధ్ర రిసెర్చి యూనివర్సిటీ వారిచే ఉచిత పఠనమందిరము లాలుమహలు మేడలో స్థాపింపబడెను.

దివితాలూకా నాగాయలంకయందు శ్రీ గోపాలకృష్ణ గ్రంథాలయము స్థాపింపబడ్డెను. ప్రారంభసభయందే రు 432 ల విరాళములు వేయబడినవి. రు 400 లు విలువగల గ్రంథములు వచ్చియున్నవి.

గూడూరుతాలూకా కురుగొండ గ్రామమున శారదా విద్యాలయ పుస్తక భాండాగారము స్థాపింపబడినది.

అనంతపురం జిల్లా కదిరి పట్టణమందుగల శ్రీ లక్ష్మీనృసింహ ఆంధ్ర గీర్వాణ పుస్తకభాండాగారము షుమారు ఆరువందల రూపాయలు విలువగల గ్రంథరాజములతో విరాజిల్లుచున్నది. ఇప్పుడు స్వంతభవనమునకై హనుమత్సేనాసంఘమువారు స్థలము నిచ్చినారు. భవన నిర్మాణమునకై రు 25౦ లు వసూలైనవి.

శేలంజిల్లా రాశిపురమునందు ఆంధ్రప్రబోధినీ గ్రంథాలయమును స్థాపించి, 500 గ్రంథములను సమకూర్చియున్నారు. ఆంధ్రోద్యమతత్వమును మాతృభాషాభిమానమును వ్యాపింపజేయుటకు గాను ఈ గ్రంథాలయము స్థాపింపబడుట మిక్కిలి ప్రశంసనీయము.

శ్రీ దేశోద్ధారక ఆంధ్రభాషా నిలయము, కుక్కునూరు; పాల్వంచ సంస్థానము; నిజాంరాష్ట్రము:—ప్రజలయందు దైవభక్తి, రాజభక్తి, దేశసేవ, సంఘసేవ, విద్యాభిమానము, మాతృభాషాభిమానము, ఐకమత్యములను పెంపొందించి నిజాంరాష్ట్ర ఆంధ్రజన సంఘాభివృద్ధికి తోడ్పడుటకును, ఆంధ్ర భాషాభివృద్ధిని కల్గించుటకును, ఆంధ్రులయందు పరస్పర సానుభూతిని గలిగించి వారల యభివృద్ధికి ప్రయత్నించుటకును ఈ గ్రంథాలయము స్థాపింపబడినది. ౧౬౦౦ గ్రంథములు గలవు. ౭౦ సభ్యులు గలరు. ౨౧ పత్రికలు వచ్చుచున్నవి. ౪౦౦ గ్రంథములు ఉచితముగా నియ్యబడినవి. ౧౯ పత్రికలు ఉచితముగా నొసంగబడుచున్నవి.